సంపుటము 4] మే, 1918 [సంచిక 11

# బాలమిత్ర



## అసూయ

ఒక పాఠశాలయందలి పిల్లలలో యెక్కువమార్కులు వచ్చినవానికి మంచి బహుమతి యిచ్చెద నని వారి ఉపాధ్యాయుడు చెప్పెను. పిల్లలందరు బహు కష్టపడసాగిరి. వారిలో పరబ్రంహామను పిల్లవాడు తాను తెలివిగలవాడైనందున తనకే ఆ బహుమతి వచ్చునని గర్వపడుచుండెను. అయితే గోపాలుడు అను బాలుడు కష్టపడిచదువుచు చివరకు ఆ బహుమతిని పొందెను. అందుచే పరబ్రంహామునకు ఆ బాలునిపై

అసూయపుట్టి పగగనుండెను. ఒక దినమున యీ బాలుడు అంగడిదగ్గర కట్టియున్న గాడిదను ఒకదానినిచూచి దాని కట్టుత్రెంచి పరుగెత్తించగోరి, వారు తనను గుర్తింతురేమో యని భయపడుచు, ఆలోచించుచుండెను. అంతలో తన శత్రువగు గోపాలుడు గాలిపటమును యెగురవేయుచు పరుగెత్తుచుండుట చూచెను. అతనిటోపీ నేలపై బడియుండెను. వెంటనే పరబ్రంహాము ఆ టోపీని తీసికొని తన తలపై పెట్టుకొని పరుగునబోయి గాడిదకట్లను కత్తితో కోసివేసి దానిని పరుగెత్తించి తాను అతి త్వరితముగా పరుగెత్తుచు వీధి దాటి పోయెను. గాని వాని టోపీనిమాత్రము గాడిద యజమానురాలు చూచి గుర్తుపెట్టుకొనెను. ఆ బాలుడు ఆ టోపీని అక్కడ తిరిగి పారవేసి హాయిగ యింటికిపోయెను. ఉదయమున బాలురు అందరు బడిలోనుండగా, గాడిద యజమానుడు బడికివచ్చి ఉపాధ్యాయునితో, పిల్లవాడు చేసిన కార్యము అంతయుచెప్పి, టోపీని గుర్తుచెప్పెను. నిర్దోషియైన గోపాలునిపై నిందవచ్చెను. పరబ్రంహాము సంతోషించుచు ఊరకుండెను. పిల్లలు అందరు గోపాలుడు అట్టికార్యము చేయునా యని విచారింపసాగిరి. కొందరు అతనిని నిందించిరి. ఉపాధ్యాయుడు ఆశ్చర్యపడెను. గోపాలుని తలిదండ్రులు చింతాక్రాంతులై తమ కొమారుని యెంత తరచి యడిగి

నను అతనిలో దోషము కనబడనందున యూరకుండిరి. మరియు ఆ గాడిదకు దెబ్బలు తగిలినందున గోపాలుడు ఆ నష్టము యివ్వవలసివచ్చెను. ఇది జరిగిన కొన్ని దినములకు బాలురందరు నదిదగ్గర బోట్లుపందెమును చూడవెళ్లిరి. కొందరు వంతెనపై కూర్చుండిరి. పొరబాటున పరబ్రంహాము నీళ్లలో బడి యీతరానివాడైనందున మునుగ నారంభించెను. బాలురందరు అది చూచి అరచిరిగాని రక్షించువారు లేరైరి. అంతలో గోపాలుడు గభాలున నీటిలో దుమికి వాని వెంట్రుకలను పట్టుకొని, పైకిలేవనెత్తి, యీత బాగుగ నేర్చినవాడైనందున ఒక పడవను చేరెను. అతనికి ఆ లోతు నీటియొక్క యురవడిలో మరి ఒకనిని యీడ్చుట కష్టమయ్యెను. పరబ్రంహాము భయముచేత చచ్చినవానివలె నుండెను. అతనికి మతిదప్పిపోయెను. ఈ బాలురు యిద్దరు ఒడ్డుచేరి క్షేమముగ యింటికివెళ్లిరి. పరబ్రంహాము స్మారకముతప్పి బలహీనత నొందుటచేత కొన్ని దినములు పడకపై నుండెను. అప్పుడు అతనిలో గొప్పమార్పు గలిగెను. తాను అంతకుపూర్వము చేసియున్న పాపమును గురించి పశ్చాత్తాపపడెను. తనచే కీడునొందిన బాలుడే తనప్రాణమును రక్షించెనని తెలిసినప్పుడు అతనికి గలిగిన సిగ్గును, విచారమును చెప్ప యెవరి తరము! తల్లితో ఆ వృత్తాంతము అంతయుచెప్పి తన తప్పును

ఒప్పుకొనెను. ఉదయమున తన తల్లితో గలిసి పాఠశాలకు వెళ్లి, ఉపాధ్యాయునియెదుటను పిల్లలయెదుటను తన తప్పు నొప్పుకొనెను. గోపాలుని దగ్గరకుపోయి క్షమాపణ యడిగెను. అందరు ఆశ్చర్యమగ్నులైరి. గోపాలుని తలిదండ్రులు తమ కొమారుని నిర్దోషత్వము బైలుపడినందులకు చాల సంతోషించిరి. ఆ నాటినుండి పరబ్రంహము గోపాలునితో అధిక సఖ్యముగానుండెను. గాడిదయజమానుడు యీ సంగతిని తెలిసికొని ఆశ్చర్యపడెను. చూచితిరా! అసూయ యెంతెంతకార్యములను చేయించునో. అసూయ పాపముగాన అది హృదయములో యెవ్వరికి నుండరాదు.

---

# కమల సీత యను నిరువురి బాలికల సంభాషణ

ఒకనాడు సాయంకాలము కమల సీత యను బాలికలిరువురు స్కూలు వదలిన పిమ్మట వ్యాయామమునకై ఊరి బైట సంచరించుచుండిరి. అప్పుడు సీత తటాలుననాగి కమలా ఆ చెట్టుక్రింద కనబడునది యేమి? రాతివలెనుండి కదలుచున్నదే! రాయి కదలునా? యేమి యీ చిత్రము! అనెను.



కమల:—వెఱ్ఱిదానా! అది రాయికాదు, దానిపేరు తాఁబే
లందురు, రాతివలె నున్నభాగము దాని వీపుపైచిప్ప.

సీత:—అట్లయిన దాని యవయవము లెచ్చట నున్నవి?

కమల:—అదిగో! ముందుభాగమున కనబడునది తల, నిదా
నించి చూడుము. దాని కన్నులును నోరును కనబడు
చున్నవి. వెనుకభాగమున నుండునది తోక.

సీత:—వీపుపైనచిప్ప యెందులకు? అట్టిది మనకులేదే!

కమల:—మనకు తగిన అవయవములు కలిగి అపాయము గలిగిన యెడల సంరక్షణ చేసికొన గలుగుచున్నాము, అది మెల్లగా ప్రాకెడు జంతువగుటచే శత్రువులవలన అపాయము సంభవించునెడల రక్షించుకొనుటకై దానికట్లు నిర్మింపబడినది.

సీత:—శత్రువులనుండి యెట్లు రక్షించుకొనగలదు?

కమల:—ఎవరైన చిన్నపిల్లలు పోకిరితనమునకై రాళ్లతో కొట్టినను లేక యే యితర జంతువులు హానిసేయఁ దలచినను, తలయును తోకయును పెట్టెలో నుంచిన మాదిరిగ ఆ చిప్పలో నుంచుకొని, భద్రముగానుండును.

సీత:—ఆ చిప్పకు దెబ్బతగులదా?

కమల:—ఆ చిప్ప కొమ్మువంటి గట్టిపదార్థముతో చేయఁబడి గిన్నెవలె వంపుగానుండి చుట్టును నేలకాని యుండుటచే దాని శరీరమునకు దెబ్బతగులదు.

సీత:—అది యెట్లు నడచును? మనవలె వేగముగా నడువ గలదా!

కమల:—మనవలె వేగముగా నడువజాలదు, కాని, అది నేలపై శరీరముతోడనే నెమ్మదిగా ప్రాకును, నీటిలోనైన దాని శరీరము క్రిందనుండు పాదముల సహాయ్యముచేనీదును.

సీత:—అట్లయిన దానికెన్ని కాళ్లు?

కమల:—నాలుగు కాళ్లుండును.

సీత:—ఇది నీళ్లలోకూడ నుండునా?

కమల:—సాధారణముగా తాఁబేళ్లు నీటిలోనే వసించును. కొన్ని నేలమీదను వసించును.

సీత:—నీటిలో నున్నయెడల దానికాహార మెట్లు దొరకును?

కమల:—నీటిలోనుండు నాచు మొదలగువాటినితిని బ్రతుకును.

సీత:—మెట్టతాఁబేళ్లేమి తినును?

కమల:—చిన్నచిన్న మొక్కలను తినును.

సీత:—ఇది యిప్పుడాహారము కొఱకై పోవుచున్నదా?

కమల:—లేదు, లేదు.

సీత:—మరెక్కడికి పోవుచున్నది?

కమల:—దీనికథ చాలగలదు.

సీత:—అట్లయిన నాకు ఆ కథ చెప్పుము చెప్పుము.

కమల:—ఒక కుందేలు తనతో సమానముగా యెవరును పరుగెత్తజాలరని డంబము కొట్టుచుండెను. ఆ మాటలువిని యీ తాఁబేలు నాతో పరుగెత్తగలవాయని యడిగెను. అప్పుడు కుందేలు వెర్రి తాఁబేలా! లేడి మొదలగు జంతు

వులే నాతో పరుగెత్తుటకు సంశయించి యూరకుండగా మందగామివగు నీవా నాతో పరుగెత్తునది చాలు! చాలు! నూరకుండుము. నెవరైనవిన్న నవ్వెదరు అనెను. అంతట తాఁబేలు వేయిమాటలతో ప్రయోజనమేమి? చేతనైన పందెమువేసి చూడవలెనని అనెను. అంతట నవి రెండును పందెమువేసికొని పరుగెత్త నారంభించెను.

సీత:—అట్లయిన కుందేలేది?

కమల:—త్రోవలో నొకచిత్రము జరిగినది. కుందేలు కొంత దూరము పరుగెత్తి తాఁబేలెంతసేపటికోగాని రాజాలదు. నే నించుకసేపు నిద్రించి పిమ్మట పరుగెత్తెదను అని యొక చెట్టుక్రింద పరుండి నిద్రించెను. తాఁబేలు మాత్రము అట్లే నెమ్మదిగా ప్రాకుచు గమ్యస్థానమగు నీ చెట్టును సమీపించినది.

సీత:—ఇది అంతయు నీకెట్లు తెలిసెను?

కమల:—నేను మధ్యాహ్నము బడికి వెళ్లునప్పుడు యిది యంతయు నేను చూచితిని.

సీత:—ఆ పరుగెత్తుకొని వచ్చునది కుందేలేనా?

కమల:—అవును! కుందేలే! తాఁబేలు నెచ్చటనుగానక మిక్కిలి ఆత్రముతో పరుగెత్తుకొని వచ్చుచున్నది.

సీత:—అట్లయిన నిప్పుడెవరు జయముపొందిరి?

కమల:—చూచుచునే యుంటివి కదా! తాఁబేలు ముందు రాలేదా?

సీత:—చిన్నగా నడిచినను తాఁబేలే పందెము గెలిచినదే!

కమల:—దీనినిబట్టి చిన్నపిల్లలమైన మనము నేర్చుకొను నీతి యేమనగా ఆరంభ శూరత్వమును, తర్వాత నిర్లక్ష్యమును గలిగి పనిచేయువారికంటే మొదట నుండియు కడవరకు పట్టుదలతో నెమ్మదిగానైనను పనిచేయువారు కార్యసిద్ధిఁగాంతురు.

సీత:—ఔనౌను మరచితి. పాఠపుస్తకములో చదివియు మరచితి. ఇప్పుడు నీ మాటలచే జ్ఞప్తికివచ్చినవి.

గీ. నడుమ విడువక పనినెల్ల నడుపువారె
కార్యసిద్ధిని గాంతురు; గాని మంచి
తఱిని నిద్రించి తఱువాతఁ దమకపడుచు
పరుగులిడువారు ఫలసిద్ధిఁ బడయరెపుడు.

నీవలన చాల సంగతులు నేర్చుకొంటిని. మనమువచ్చి చాలసేపయినదని వా రుభయులును యనుకొని నొకరొకరు సలాములు చెప్పుకొని వారివారి గృహములకు జనిరి.

# మద్యపాన కీర్తన

కల్లు భంగి సారాయి త్రాగువాని కడగండ్లు చూడండి
వాడొల్లుమత్తునజేయు భ్రష్టత్వం బెల్లను జూడండి.

1. కల్లుద్రాగుట నాకు చల్లదన మంటాడు
ఒళ్లునొప్పులుదీర నొప్పుసారంటాడు
చెల్లుభక్తికి భంగి చేకొంటి నంటాడు
యెల్లకీడులమూలమై తానేయుంటాడు ॥ కల్లు ॥

2. మత్తు అధికముబొంది మతిదప్పియుంటాడు
యుత్తమాయుత్తంబు లూహింపకుంటాడు
సత్తుగాద్రాగుటే సంభ్రమని యంటాడు
పిత్తమించుక లేక పిచ్చివాడవుతాడు ॥ కల్లు ॥

3. ఎంతసొమ్మయిన నాదే ఖర్చులంటాడు
చింతపడకుడిమనకు సంతోషమంటాడు
పంతమాడకు ఒసే యెంతున్నదంటాడు
యెంతలేదన్న తా నెరుగలేకుంటాడు ॥ కల్లు ॥

4. ఇమ్మయినపైబట్ట లమ్ముకొనుచుంటాడు
దిమ్మరై యూరంత దిరుగుచునుంటాడు
దమ్మిడిదొరకిన ద్రాగవలెనంటాడు
సొమ్మంత వ్రయపరచి సోదాయవుతాడు ॥ కల్లు ॥

5. అప్పయిన భిక్షమునడుగుతానంటాడు
నిప్పువంటిసార నేగొందునంటాడు
చెప్పశక్యముగాని గప్పాలుగొడతాడు
తప్పించుకోలేక తాజిక్కుబడుతాడు ॥ కల్లు ॥
6. పాలుమాలకతిరిగి బహుదప్పిగొంటాడు
గోలచేయుచు సారగి కూలంగబడుతాడు
తాలిమించుకలేక తంటాలుబడుతాడు
సోలుచు తూలుచు సొల్లుగారుస్తాడు ॥ కల్లు ॥

---

# యేసు ముఖదర్శనము

ఒక భక్తుడు ఒకనాడు తన గదిలో ఒంటరిగా ప్రార్థన చేసికొనుచు, "యేసుస్వామీ, నిన్ను నేను ముఖాముఖిగా చూచు భాగ్యము యెన్నటికి కలుగునో, నీ జీవము నాయందు యెప్పటికి నిండుగా ప్రతిఫలించునో" యని విన్నపము చేయుగా ఆ సమయమున ఆయన యింటిపనికత్తె బహు విలువగల గాజుపాత్ర, చెయ్యి జారిపడి పగిలిపోయినదని తన యజమానునికి చూపించుటకు వచ్చెను. అదిచూచి ఆయన అంత అశ్రద్ధయేల చేసితివని కోపగించుకొని, తాను పని మీద నుండగా తనను అటుల తొందరపెట్టరాదని చెప్పి

పంపివేసెను. కొంచెముసేపు తాళి మరల, "యేసుప్రభో, నీ ప్రేమగలవాక్కు నా చెవికి వినిపింపవా" యని ప్రార్థన చేయుచున్న సమయమున ఆయన చిన్నబిడ్డ బొమ్మ విరిగి పోయినదని యేడ్చుచువచ్చి తన గదియొద్ద నిలువబడగా చూచి, "నన్ను తొందరపెట్టవద్దు, వెళ్లిపొమ్ము" ని ఆ బిడ్డను పంపివేసెను. తిరిగి మూడవసారి, "స్వామీ, నామీద నీకు ప్రేమయున్నట్లు నాకు ఒక సూచన అనుగ్రహింపవా" యని ప్రార్థించెను. గాని యేమి ప్రత్యుత్తరము రాకపోగా ఆయన లేచి తన పనిమీద యింటిలో తిరుగసాగెను. ఆయన పనికత్తె మనస్సునొచ్చి చిన్నపోయిన ముఖముతో తనపనిని చేసికొనుచుండెను. ఆయనబిడ్డ ఒక మూలను యేడ్చియేడ్చి విరిగి పోయిన బొమ్మను చేతపట్టుకొని నిద్రపోవుచుండెను. అది చూడగా ఆయన మనస్సులో యెవరో పలికినట్లు" యెటు పోయినను ప్రేమను, దయను చూపుమని అడుగుచున్న నీ యేసురక్షకుని నేనే. నీ జాలిని ప్రేమనుకోరి నీయొద్దకు వీరిద్దరువచ్చిరి. అవి వారికి చూపకపోతివి. వారియందు నన్ను కనిపెట్టవలసినది కనిపెట్టకపోతివిగదా. నావలె నీవు ప్రేమతోను జాలితోను నిండినవాడవగువరకు నన్ను నీవు చూడజాలవు" అని వినబడెను.



# బైబిలు పిల్లలు



దానియేలు (రాజభోజనము వద్దనుట)

చాలవందల సంవత్సరముల క్రిందట ఒక రాజమందిరములో నొక చిత్రమగు విషయము జరిగెను. నలుగురు బాలురు రాజుగారి బోర్డింగు మేనేజరుయొద్దకు బోయి తమ కిచ్చుచున్న భోజనము బాగులేదనిరి. వారికి పెట్టబడిన రాజభోజనము బాగుగా నుండలేదట. ఈ మాట మనకు ఆశ్చర్యముగా నుండవచ్చును. రాజులు తినుభోజనము పెట్టిన యెడల వద్దనువా రెవరు? వీరికి పెట్టబడినది బహు శ్రేష్ఠమైనది, గాని వారి కది యిష్టములేకపోయెను. ఆ నలుగురు

బాలురు బహు నిష్ఠపరులు. వారు తాము తినగూడదని తమ పెద్ద లాజ్ఞాపించినదానిని తినగోరలేదు. ఒకటి రెండు సారులు వారు తినలేదు. దానిని ముట్టనైనను లేదు. మూడవ దఫా సేవకు లది తెచ్చియిచ్చినప్పుడు వద్దని చెప్పిరి. ఈ సేవకులు బోయి మేనేజరుగారికి జెప్పుకొనిరి. అతడు త్వర త్వరగా వారిని బిలిపించుకొనెను. వారు తినని యెడల చిక్కిపోదురు. చిక్కినవెంటనే రాజుగా రది కనిపెట్టి నాని శిరస్సు తీసివేయించును. రాజుగారి ముందర యెల్లప్పుడును తిరుగుటకై, అతడు తన రాజ్యమంతటిలోనుండి బహు జాగ్రత్తగా వెదకించి, గొప్ప వంశస్థులును, తెలివితేటలు గలిగినవారును, చక్కనివారునైన బాలురను దెప్పించి వారికి రాజభోజనము నిచ్చి, రాజబిడ్డలకు తగిన చదువులు చెప్పించవలెనని కోరియుండెను, గాన ఈ బోర్డింగు మేనేజరు వారి విషయమై బహు శ్రద్ధబుచ్చుకొనెను. వీరు భోజనము తినలేదనగానే అతనికి భయముపుట్టెను. వారు రాగానే వారిని జూచి,

మేనే:—"అబ్బాయీ! భోజన మేల చేయరు?" అని అడిగెను.

దాని:—అయ్యా! అట్టి భోజనము మాకు దయచేసి పెట్టకండి.

మేనే:—ఎందుకు?

దాని:—అట్టిది మే మెన్నడు తినలేము.

మేనే:—ఇప్పుడు దానిని తినినయెడల మీకు మంచిబలము వచ్చును. రాజుగారు స్వయముగా దానిని పంపుచున్నారు.

దాని:—అయ్యా! మేము యూదులము. ఇతరుల చేతియన్నము నెన్నడును తినలేదు. తినరాదు. తినినయెడల మాకు అంటు.

మేనే:—అయ్యో! నే నేమిచేయుదును? రాజుగారు నా శిరస్సు దీసివేయునే.

దాని:—ఆలాగు జేయ నవసరములేదు. మా మనవి వినుడు.

మేనే:—ఏమిటది?

దాని:—మాకు గింజలను నీటినిమాత్ర మియ్యుడు దానిని దిని మేము జీవించగలము.

మేనే:—మీరు జీవించవచ్చునుగాని నేనుమాత్రము చత్తును. అదెంతమాత్రము పనికిరాదు. మీతోటివారు మీకంటె బలశాలురుగా కనుపడినయెడల నాతల యెగురును.

దాని:—అట్లయిన ఈ నెలాఖరువరకు జూడుడు. అప్పటికి మేము తక్కినవారికంటె మెరుగుగా నుండనియెడల మీరు చెప్పినట్లు చేతుము.

మెనేజరు సరేనని యొప్పుకొనెను. నెలాఖరున దానియేలును వాని ముగ్గురు స్నేహితులును అన్నివిషయముల

లోను మెరుగుగా నుండిరి. తెలివియందును, బలమందును, రూపమందును హెచ్చుగా కనుపడిరి.

రాజభోజనముకంటె దైవాశీర్వాదకరమగు గింజలు నీళ్లు మేలని మేనేజరు గ్రహించి వారి కవిమాత్రమే ఇచ్చెను.

---

## బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా! నాకు బాలమిత్రను చదువుటకు మిక్కిలి యిష్టము పుట్టినది. నేను ప్రతి మాసమును బాలమిత్రను తీయుచున్నాను. మెకాలి అమ్మగారు మనకొఱకు బాలమిత్రను ఏర్పరచినందులకు మనము దేవుని ప్రార్థించునది యేమనగా:- ఆమె చాలయేండ్లు బాగుగా నుండవలయును. నేను పచ్చయప్పాస్ కాలేజిలో మొదటి ఫారము చదువుచున్నాను. నా క్లాస్‌లో నాలుగు సెక్షన్స్ యున్నవి. ఒక్కొక్క సెక్షనుకు నలువది బాలురున్నారు. నేను ఒక సెక్షనుకు మానిటర్‌గా నున్నాను. ఇంతయే సమాచారములు.

ఇట్లు

పీ. ధరణీపతి,

సెన్ట్రల్ స్టేషన్, చెన్నపట్టణము

C. L. S. PRESS, MADRAS—1918